





# ధర్మము

విచారణ

## ఆంధ్ర తనయ-నీతి గీతికలు





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120012575

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals
Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions |
Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఆంధ్రతనయ

[ నీతి గీతికలు ]

రచయిత :

సరళకవి

గుఱ్ఱపుడియ సత్యనారాయణమూర్తి

గురురాజ బ్రదర్సు

అరండల్ పేట 11 వ లైను

గుంటూరు - 2

# తొలిపలుకు

నేటి బాలబాలికలే రేపటి పౌరులు. భావి భారత దేశము విజ్ఞాన వంతము కావలెనన్నచో ముందుగా బాల బాలికలు విజ్ఞానవంతులు కావలెను. ఇట్లు వారిని సుశిక్షితు లుగా చేయుటకు ఒజ్జలకే. చిన్నతనమున అలవడు గుణములే భవిష్యత్తున ఎంతయో యుపయోగపడగలవు. ఈ మంచిని పురస్కరించుకొనియే పాఠశాలలయందు నీతిబోధ జరుగు చున్నది. పద్యము లన్నను, వాటిని పాడుట యన్నను పిల్లలకు మిక్కిలి యిష్టము. వారికి గఱపు నీతిని, అలతి అలతి మాట లతో సులువుగా యర్థమగునట్లు వ్రాసిన అందలి నీతిని పిల్లలు గ్రహించుకొని భావిజీవితమును చక్కదిద్దుకొందు రనుటలో అతిశయోక్తి ఏమియు లేదు. ఈ సూత్రమును పురస్కరించు కొనియే, "ఆంధ్ర తనయ" నీతిగీతికలను సరళకవి శ్రీ గుఱ్ఱప్పుడియ సత్యనారాయణమూర్తి రచించుట ముదా వహము.

ఈ నీతిగీతికలు విద్యాప్రణాళిక ననుసరించి వ్రాయబడి నవి. ఈ నీతిగీతికల ప్రయోజనమును గుర్తించి పరిపాలక వర్గమువారు, ఉపాధ్యాయులు, పాఠశాలలయందు ఈ పుస్తక ములనుంచి విద్యాబోధన జరిపింతురు గాత!

రెడ్డివారి వెంకటరెడ్డి
కమీషనర్
హిందూమత దేవాదాయ ధర్మాదాయముల బోర్డు
"ఆంధ్రస్టేటు"
హెడ్ ఆఫీసు — గుంటూరు.

# అంకితము

అలరించినావు మహాప్రతిభాశక్తి
తనరార సస్వనంతతుల సతము
కరుణించినావు సత్కార్యధుర్యమేపార
వ్యధలతో మునుగు నిర్భాగ్యతతిని
విహరించినావు కవిప్రవరశ్రేణి
పెనగూడి మోహాన ననుదినమ్ము
మురిపించినావు కమ్మని భాషణమ్ములు
జాలువారగ సుహృదాళిమెసగ

రామచంద్రుని సేవలో రాత్రి పవలు
తేలినా వీవు సద్భక్తపాళి మెచ్చ
అందుకోవయ్య ప్రణయాభివందనములు
సుగుణజనగేయ ! మహనీయ ! సుబ్బరాయ

చాల నిన్నుఁ బొగడఁ జాలంగలేనోయి
సుగుణ ఖనివి నీవు సుబ్బరాయ
పుచ్చుకొమ్ము దీనిఁ బొసఁగ నీ కిత్తును
" ఆంధ్ర తనయ " శతక మంకితమ్ము.

కొమరు మీరినట్టి గుఱ్ఱప్పడియవంశ
మందుఁగవిగ జననమందినాఁడ
నన్ను జనులు సత్యనారాయణుం డంద్రు
ఆర్యజనవిధేయ ! ఆంధ్రతనయ !

# కానుక

**తమ్ముళ్ళూ! చెల్లాయిలూ!**

ఎన్నో సంవత్సరాలనుంచి మీతో నాకు పరిచయముగలదు, మీ చదువుకు కావలసిన రకరకాల పుస్తకములు వ్రాస్తున్నాను.

ఎన్నాళ్ళనుంచో నా అనుభవమును పురస్కరించుకొని మీ కేదైనా ఒకమంచి కానుక యివ్వాలని అనుకుంటుంటి. కాని పనితొందరలతోను, అనేక అడ్డంకులతోను కాలము గడచిపోతున్నది.

ఈ నాటికి శ్రీ. సుబ్బారావు [illegible] సహాయ ప్రోత్సాహములతో నా కోరిక నెరవేర్చుకొన్నాను.

ఈ "ఆంధ్రతనయ" (నీతిశతకము) మీకు కానుకగా సమర్పిస్తున్నా. సంబరాలతో అందుకోండి.

"ఆంధ్రతనయ" అను పేరుతో నీతులను, అనుభవములను వెదకి, వెదకితెచ్చి మీ కొఱకు వీటన్నింటిని మేలైన పద్యాలలో దండగా కూర్చితిని. వీటిని సూక్తులంటారు. వాడుకొన్నకొద్దీ క్రొత్త, క్రొత్త మెఱుగులు చిమ్ముతూ వుంటవి.

మీఅందఱూ ఈ "ఆంధ్ర తనయ" రత్నాలను కంఠస్థం చేసుకోవాలి. అప్పుడే మీరు ధర్మసంపదలతో, నీతినియమాలలో, నవ్యశోభలతో, ప్రకాశిస్తారు. నవ్యాంధ్రరాష్ట్రానికి ఉత్తమ పౌరులై ధర్మబద్ధమైన సేవ చేయ గలుగుతారు. తెనుగుతల్లి మిమ్ముల్నిచూచి ఉప్పొంగిపోయి చిరంజీవులు కండని ఆశీర్వదిస్తుంది. దయతో అమూల్య అభిప్రాయములిచ్చిన పండితులకు నా నమస్కారములు.

జైహింద్!

మీ శ్రేయోభిలాషి

సరళకవి

గు. సత్యనారాయణమూర్తి

శాంతి తృప్తి మంచి సమరసభావంబు
గలుగువాఁడు ధరను ఘనుఁడె యగును
గాంధి పొందలేద ఘనకీర్తి యీనాఁడు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 10

ఘోరయుద్ధమందు గుండెలు ద్రవియించి
ధర్మమూర్తి యౌచు ధరణిలోన
ఆ యశోకనృపతి ఆర్జించెరా కీర్తి
ఆర్యజనవిధేయ ! ఆంధ్రతనయ ! 11

కవులఁ బూజచేసి ఘనకీర్తి గడియించి
కృతుల వ్రాసి తాను కృతుల నంది
ఆంధ్రభోజుఁడయ్యె అలనాఁటి రాయలు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 12

ముద్దులొలుకుచుండు మూఁడు రంగులతోడ
మన పతాకలక్ష్మి మహిని వెలసె
చిన్ని చేతులెత్తి జేజేలు పలుకరా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 13

అయ్యవారటన్న నధికుండురా యుర్వి
విద్య నేర్పు గొప్ప వీరుఁ డతఁడు
మహిని గురువుతప్ప మరియొకండును లేఁడు
ఆర్యజనవిధేయ ! ఆంధ్రతనయ ! 14

భరతదేశ దాస్యబంధమ్ము సడలింప
శాంతిసమరమందు సమసినట్టి
జోధులను దలంచి జోహారు లీయరా
ఆర్యజనవిధేయ ! ఆంధ్రతనయ ! 5

ఆంగ్ల గుండెలందు నగ్గిని రగిలించి
ఢాక చూపినాఁడు టంగుటూరి,
కీర్తిఁ బడసె 'నాంధ్రకేసరి' యని, నాఁడు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 6

ఆంధ్రరత్నమౌచు ఆర్జించుకొని కీర్తి
నిగ్గుదేలినాఁడు దుగ్గిరాల
"రామదండు" పేరు రచ్చ కెక్కించెరా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 7

మార్గదర్శి మనకుఁ మన గాంధితాతయ్య
నిత్య శాంతిదూత నెహ్రు బాబు
పూజ్యతముఁడు మనకు పొట్టి శ్రీరాములు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 8

విస్మరింపకోయి విజ్ఞానఖని యౌచుఁ
దెలుఁగువారి పేరు నిలిపినట్టి
యోగివరుడు బౌద్ధ నాగార్జునాచార్యుఁ
డార్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 9

గేలిచేయువానిఁ గొంటెవా డందుఘ
నీతిదప్పువాని నీచు డంద్రు
ఆడితప్పువాని నధమాధముం డంద్రు
ఆర్యజన విధేయ! ఆంధ్రతనయ! 20

కోఁతిచేష్టలున్నఁ గొంటెవా డందురు
నక్కబుద్ధియున్న టక్క రంద్రు
సుగుణజాల మున్న సుజను డందురు నిన్ను
ఆర్యజన విధేయ! ఆంధ్రతనయ! 21

మానవునకు మంచి మన సుండవలయును
బుద్ధిలేనివాడు శుద్ధశుంఠ
మంచివదలునాడు మార్గంబు దొరకునా
ఆర్యజన విధేయ! ఆంధ్రతనయ! 22

నీకు హానిచేయు నీ కోపతాపంబె
ఈర్ష్య కలుగఁజేయు నిడుమ లెన్నొ
దుష్టబుద్ధి నిన్ను దుర్మార్గుఁ డనిపించు
ఆర్యజనవిధేయ! ఆంధ్రతనయ! 23

పెద్దపెద్దఘనుల స్వీయగాథలు విన్న
మొద్దుకైన కొంత బుద్ధి గలుగు
చెడ్డగుణము పోయి దొడ్డవాఁ డౌనురా
ఆర్యజన విధేయ! ఆంధ్రతనయ! 24

చదువు గురుడు చెప్పు సమయమ్ములో నీవు
వ్యర్థభాషణమ్ము లాడుచున్న
పాఠ మెఱుకపడక పాడౌదు రందఱు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 15

బద్ధకస్థుఁ డెపుడు పాఠాలు చదువక
అయ్యవారి దెబ్బ లందుకొనును
తుదిని దానె చెడును మొదలంటఁగా గూలి
ఆర్యజనవిధేయ ! ఆంధ్రతనయ ! 16

మొట్టికాయ తినక పుట్టదు సద్బుద్ధి
దెబ్బతినక చదువు లబ్బఁబోవు
గురువులేని విద్య కుదురుగ నుండునా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 17

కోడికూయఁగానె కూర్మిఁ బ్రార్థన సేసి
కాలకృత్యములను గ్రమముతోడ
చక్కఁగానొనర్ప సన్మార్గమబ్బును
ఆర్యజనవిధేయ ! ఆంధ్రతనయ ! 18

వేళతప్పకుండ వేగమె బడికేగి
ప్రార్థనంబుచేసి పాఠములను
నేర్చుకొంటివేని నీకబ్బు సద్బుద్ధి
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 19

ఆతవారివలన నమరురా ఘనకీర్తి
ఆతవారివలన నణఁగు యశము
ఆతవారి శక్తి యద్వితీయమ్మురా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 30

పరగ శత్రువులకు ప్రక్కలో బల్లెమౌ
పడఁతి రుద్రమాంబ పౌరుషమ్ము
నిలచియున్నదోయి నేఁటికి హృదయాల
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 31

అక్కజమ్ముఁ గూర్చు అమరావతీ శిల్ప
సంపదలు తెనుంగుశక్తి జాటు
తెలుఁగు వెలుఁగునాఁడు దిశలందు వెలిగెరా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 32

ఆంధ్రభూమి నాది ఆంధ్రభాషయె నాదు
మాతృభాషయంచు మననఁజేసి
దిశలలోన జాతి దీధితి నింపరా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 33

నాగులేటిప్రక్క నాగమ్మ నెదురింప
బాలచంద్రుఁడపుడు కాలుఁడయ్యె
పాతపడిన కథల పాతరతీయరా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 34

తల్లి దండ్రి గురువు దైవమ్ము నేలిక
భక్తితోడఁ గొల్వవలయు నెపుడు
పాపమెల్లఁ బోయి పరిశుద్ధు డౌటకు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 25

తల్లిదండ్రి మాట తలఁదాల్చు తనయుఁడే
తనయుఁ డౌను సుమ్ము ధరణియందు
తలను దాల్పనట్టి తనయుఁడు తనయుఁడే
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 26

తల్లిదండ్రి గురుడు ధరలోన దైవాలు
వారి వాక్కు వేదవాక్కు నిజము
వారిమాట వినిన భాగ్యాలు కలుగురా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 27

తల్లిదండ్రికన్న దైవంబుకన్నను
భర్త గొప్ప సుమ్ము భార్య కెపుడు
భర్తసేవ చేయఁ బరమమోక్షం బబ్బు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 28

గృహిణి మంచిదైన గృహముకు పేరుండు
కొడుకు మంచివలన కులము వెలుఁగు
చిత్తశుద్ధివలనఁ జేకూరు సత్కీర్తి
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 29

విద్య యున్న దనుచు విఱ్ఱవీగకుమోయి
భాగ్యమున్న మిడిసిపడకుమోయి
మనసు మార్చి మదము మనుజుని చెఱచురా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 40

విత్తమున్ననాఁడు విఱ్ఱవీగకు బాల
పస్తునాడు దిగులుపడకుమోయి
కష్టసమయమందె కావలె సహనమ్ము
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 41

కలిమిలేములన్నఁ గావడికుండలు
వరుసమారి సతము వచ్చుచుండు
కొన్నినాళ్ళు తమము కొన్నాళ్ళు వెన్నెల
ఆర్యజనవిధేయ ! ఆంధ్రతనయ ! 42

ధనము కలుగునాఁడు దరిఁజేరి బంధువుల్
కొల్లగొట్టుచుంద్రు గుల్లచేసి
ధనము లేనినాఁడు దర్శన మీయరు
ఆర్యజనవిధేయ ! ఆంధ్రతనయ ! 43

ధనము పూర్తియున్న తనయుల కొఱతరా
తనయులుండెనేని ధనము వెలితి
తారతమ్య మిట్లు తప్పక ధరనుండు
ఆర్యజనవిధేయ ! ఆంధ్రతనయ ! 44

అల్లసానివాని అల్లిక జిగిబిగి
ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు
తెలుఁగునేలఁ బారెఁ దేనెల వాఁకలై
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 35

భారతంబు నేఁడు పంచమ వేదంబు
భక్తిపూరితమ్ము భాగవతము
రమ్యగాథ మనకు రామాయణమ్మురా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 36

భాగవతము నాఁడు బమ్మెరపోతన్న
వ్రాసినాఁడు భావబంధురముగ
పద్యపద్యమందుఁ బ్రవహించెరా తేనె
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 37

విద్యయున్నవాఁడె విశ్వంబులోఁ జెల్లు
విద్యవలన గీర్తి విస్తరించు
విద్య యిచ్చునోయి విజ్ఞానవిభవమ్ము
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 38

కొసరి కొసరి కూయు కోయిలచందాన
రాగమొలికినాఁడు త్యాగరాజు
కృతుల భక్తిరసము కృష్ణలై పారెరా
ఆర్యజనవిధేయ ! ఆంధ్రతనయ ! 39

మంచిగాలి నీరు మంచి యాహారమ్ము
అమరెనేని రోగ మసలురాదు
రోగిగానివాఁడె భోగాలఁ దేలురా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 50

పిల్లిపాలువోలె బాహ్యమిత్రము లుండ
ఎలుక పిల్లివోలె హీనులుండ్రు
ఉత్తమాధమాత్మ వృత్తు లిట్లుండురా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 51

నీరుపోవ పాలు నిప్పులోనికి దూకు
నీరు చల్లినంతన నిలచియుండు
స్నేహితు లగువారి చిత్త మిట్లుండురా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 52

మిత్రుఁ డైనవాఁడు మిక్కిలి ప్రేమతోఁ
గాంచుచుండుఁ గష్టకాలమందు
వదలిపెట్టఁబోఁడు ప్రాణాలుపోయిన
ఆర్యజనవిధేయ ! ఆంధ్రతనయ ! 53

నీవె ప్రాణమనుచు నిన్ను నమ్మినయట్టి
చెలిని మోసగింపఁ దలచకోయి
మోసగింతువేని ముందుకుపోలేవు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 54

సద్గుణంబు లేక సన్మార్గుఁడగు టెట్లు
భక్తిలేక ముక్తి బడయుటెట్లు
ధనము లేక గొప్పతన మెట్లు గల్గురా
ఆర్యజనవిధేయ ! ఆంధ్రతనయ ! 45

ధనము గలుగువాఁడు దర్పంబుఁ జూపించి
విఱ్ఱవీగువాఁడు వెఱ్ఱివాఁడు
ధనము చంచలమని తలఁచరా మదిలోన
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 46

ప్రజల సేవకొఱకుఁ బ్రాణ మొడ్డెడువాఁడు
మూలఁజేరినాఁడు కాలవశత
పదవులన్ని నేఁడు స్వార్థులపాలయ్యె
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 47

ప్రజల రాజ్యమయ్యె భారతదేశంబు
దేశభక్తనివహ దీక్షవలన
భావిలోన దేశపరిపాలకుఁడ వీవె
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 48

అన్నమునకు ముందు ఎన్నఁడేనియు నీవు
తినకుమోయి పాడుతిండ్లు తండ్రి
అన్న మరుగకున్న ఆరోగ్య మణగారు
ఆర్యజనవిధేయ ! ఆంధ్రతనయ ! 49

నీకుఁగాని పనికిఁ బోకు మెన్నఁటికిని
ముప్పు వచ్చు నెంత గొప్పకైన
కోతి మేకుఁ బీకి కోల్పోయెఁ బ్రాణాలు
ఆర్యజన విధేయ! ఆంధ్రతనయ! 60

చేతగానివాఁడు చేరి యింకొక్కని
సాయమూని పనులు సేయవలయు
అద్దమందు జూచి దిద్దుకోమా రూపు
ఆర్యజన విధేయ! ఆంధ్రతనయ! 61

హింసచేయు మాట నెన్నడు వినఁబోకు
చేయఁగలిగినంత చేయు మంచి
మంచి చేయకున్న మానుము చెడుగైన
ఆర్యజన విధేయ! ఆంధ్రతనయ! 62

చేరి నవ్వుకైన చెప్ప కబద్ధమ్ము
మాట నమ్మరెవరు చేటు గలుగు
మకరి పట్టెనంచు మరణించెఁ జాకలి
ఆర్యజన విధేయ! ఆంధ్రతనయ! 63

కల్లలాడువాఁడు చెల్లునా జగతిలో
ఓర్పులేనివాఁడు తీర్పరగునె
రోగమున్నవాఁడు భోగాలఁ దేలునా
ఆర్యజన విధేయ! ఆంధ్రతనయ! 64

సాధువు లగువారి సహవాస మొనరించు
చెడ్డవారితోడఁ జెలిమి వలదు
ఆఱు నెలలలోనె వారు వీరౌదురు
ఆర్యజన విధేయ! ఆంధ్రతనయ! 55

కపటులైనవారు కమ్మగా మాటాడి
పట్టి బుట్టలోనఁ బెట్టుచుంద్రు
కాకిముక్కు నక్కు కాజేయు వాఁడు
ఆర్యజన విధేయ! ఆంధ్రతనయ! 56

చేతకానివాఁడు చెప్పుచుండును లక్ష
చేయువాఁడు మాట చెప్పఁబోడు
అఱచుచున్న కుక్క కఱచునా యెందైన
ఆర్యజన విధేయ! ఆంధ్రతనయ! 57

నక్క వెదకు దూర బొక్కల సతతమ్ము
పంది వెదకుచుండుఁ బాడుబురద
దుష్టుఁడైనవాఁడు దోసఁగుల వెదకురా
ఆర్యజన విధేయ! ఆంధ్రతనయ! 58

మనసులోన నొకటి మాటలో నొక్కటి
చేయుదాన నొకటి చేతువేని
చెటుకలిగి నీకుఁ జేకూఱురా హాని
ఆర్యజన విధేయ! ఆంధ్రతనయ! 59

సర్వజనులచేత సన్నుతిపొందుట
చేతకాదు సృష్టినేతకైన
మంచిచెడుల నెపుడు మనసునఁ దలచుము
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 70

ఇంటియీగతెచ్చు నెగ్గన్నసామెత
మడినిదలచు మెపుడు మరువకోయి
ముద్దుపెట్టఁ గత్తి మూతినిగోయదే
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 71

కనులె నీకు హాని కలిగించుచుండును
చెవులు తెచ్చునయ్య చేటు నీకు
కాన తెలిసినడువు కడునేర్పుతో నీవు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 72

అర్జనమ్ము నాఁట నందఱు చుట్టాలె
లేనినాఁడు తోడు లేనివాడె
రూకలేనినాఁడు పోకకు సరిగాఁడు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 73

పరునిభార్య దలచఁ బాతకం బగునయ్య
పరుల సొమ్ము పాముపంటిదయ్య
రాముభార్యగోరి రావణుఁ డణగారె
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 74

మాటతప్పువాఁడు మనుజుఁడు గాఁడయ్యె
మాటలోనె మంచి మాట యుండు
మంచిపేరు వచ్చు మాటలవలననే
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 65

మంచిపేరు పొంద మహిలోన గష్టమ్ము
హీనుఁడన్న నామ మిట్టెవచ్చు
కష్టపడినఁగాని కలుగదు ఫలితంబు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 66

పరులతోడ నెపుడు పలుక కనిష్టమ్ము
మనసు కెరిగి మనము మసలవలయు
మనసు మంచిదైన మనుజులు నట్టిరే
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 67

పరులనిందచేయఁ బాపంబు కలుగును
ఆత్మనిందవలన హానికలుగు
దైవనిందవలనఁ గైవల్యమేపోవు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 68

కడుపుజూచు తల్లి కొడుకును పరికించి
అలుజూచు భర్తయార్జనమ్ము
మాన్యుఁ డైనవాఁడు మంచిని జూచురా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 69

చిత్తశుద్ధి లేక చేసిన కార్యమ్ము
చేసినట్టె యుండు చెడును తుదకు
సత్యదేవి వ్రతము సఫలతఁ జెందెనా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 80

చెడ్డరోజులైన చేకూరు కష్టముల్
ధాతకైన వాని తాతకైన
పాండురాజసుతులు పడలేద యిడుమలు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 81

పాండురంగ ! దేవ ! పండరీశా ! యంచు
భక్తి వేఁడుకొనెడు భక్తవరుల
కంటిరెప్పవోలెఁ గరుణించు దేవుండు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 82

ఎలుక నెక్కువాని, నెద్దు నెక్కెడువానిఁ
బకినెక్కువాని భక్తితోడ
తలచుచుంటివేని తొలగును పాపమ్ము
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 83

దేవదేవుదివ్య దివ్యప్రభావంబు
తెలియగలమె తేటతెల్లముగను
బాలకృష్ణుఁజూచి బ్రహ్మయే పారఁబడె
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 83

నీతి వదలుకొన్న నీ సోదరులనేని
విడిచిపెట్టవలయు విశ్వమందు
అల విభీషణాఖ్యుఁ డన్నను వదలఁడా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 75

కాలు జారెనేని గ్రహియింపఁగావచ్చు
వాయి జారెనేని వలను పడదు
మాటతీరు నెఱిఁగి మాటాడవలయురా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 76

నీతులెన్నొతీసి నీటుగఁ జూపించి
భాషణములు వేలు పలుకవచ్చు
ఆచరించుటన్న అసలు కష్టంబురా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 77

గుణశతమ్ములందు గణనకు రాఁబోవు
చేరియున్న చిన్న చెడ్డతనము
చందమామలోన కందు కన్పించునా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 78

చెడ్డదినములందు చేకూరు నిడుములు
మంచి రోజులైన మాయమగును
చెడ్డ మంచి యెపుడు చెప్పి రాఁబోదురా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 79

లేమికంటె బాధ లేదురా జగతిలో
గలుగుచుండు నెన్నొ కష్టములును
నీతి దప్పిపోయి నిందలపాలౌను
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 90

కార్యసాధకుండు గణనకు రానీఁడు
కష్టసుఖము లెన్ని కలుగుచున్న
పట్టుఁబట్టి తాను పనులను సాధించు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 91

పెండ్లిబులు పెకాని పెండ్లామువచ్చిన
నాఁటినుండి కలుగు కోటివెతలు
మొదటి బులుపు లన్ని మూన్నాళ్ళముచ్చట్లు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 91

తాటిక్రిందఁబాలు త్రాగినఁ గల్లంచు
ఆడిపోతురోయి భువనిజనులు
కాన తెలిసినడువు కడుజాగరూకత
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 93

కష్టకాలమందుఁ గంగారుపడుటెల్ల
బేలతనము సుమ్ము పృథివిలోన
తాల్మిబూనవలయు దైన్యంబు కొఱగాదు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 94

తనకుఁ దానెగాక, తన కెవ్వరును లేరు
బంధువైన చుట్టపక్కమైన
పుణ్య పాపఫలము పూర్తిగా వెంటాడు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 85

పుట్టు జీవు లన్ని గిట్టుట తథ్యము
వెనుక ముందుగానొ విశ్వమందు
పుట్టుచున్నవాఁడు గిట్టుట వింతయా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 86

ఐకమత్యమున్నఁ జెకూరు లాభంబు
చీలిపోవ నెపుడు చేటుగలుగు
కట్టివేయు గజము గడ్డిపోచలు కూడి
ఆర్యజనవిధేయ ! ఆంధ్రతనయ ! 87

పట్టుదలనుబనిని గట్టిగఁ జేసిన
ఫలిత మొందఁగలవు బాగుగాను
అల భగీరథుండు నారీతిజేయడా !
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 88

తెలియలేదటన్నఁ దెలివితక్కువగాదు
తెలియు సర్వ మంచుఁ బలుకరాదు
తెలిసికూడ మనకుఁ దెలియవురా కొన్ని
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 89

మల్లినాథసూరి మహితాత్ముఁ డానాఁడు
భార్య నవ్విపోవ పౌరుషాన
కాశిలోన జదివి ఘనపండితుం డాయె
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 100

మతముపేరు చెప్పి మానమ్ము విడనాడి
కొప్పుపట్టి కొట్టుకొనఁగనేల
మనసు లొకటియైన మతముల జోలేల
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 101

కయ్యమునకుఁగాని నెయ్యంబునకుఁగాని
వియ్యమునకుఁగాని విశ్వమందు
స్థాయి చూడుమంచుఁ జాటిరి పెద్దలు
ఆర్యజనవిధేయ ! ఆంధ్రతనయ ! 102

వెలఁది జూదము మరి వేఁట పానమ్ములు
పరుషదండనమ్ము భాషణమును
వ్యర్థమైన ఖర్చు వ్యసనమ్ము లనినారు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 103

కామశర్మగారు కాశిలో శ్రమియించి
చదివినాడు చాల శాస్త్రములను
బిచ్చగానికింత పెట్టఁడు బిచ్చమ్ము
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 104

చేతగాదటంచుఁ జింతతో సతతమ్ము
క్రుంగిపోవుచున్నఁ గూలు బ్రతుకు
చేయుచున్నకొలఁదిఁ జేకూరు ఫలితమ్ము
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 95

విరిగెనేని యినుము సరిచేయగావచ్చు
గుడ్డచినిగెనేని కుట్టవచ్చు
మనసు విరిగెనేని మరి చక్కఁబడఁబోదు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 96

ఇంటిగుట్టు పరుల కెరగింప కెన్నఁడు
దానివలన నాత్మహాని కలుగు
అట్టి గుట్టు తెలుప నణగారదా లంక
ఆర్యజనవిధెయ ! ఆంధ్రతనయ ! 97

మనసులోని చింత మానావమానంబు
కొంపలోన జరుగు కూళతనము
మోసగింపు పరులముం దనరాదురా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 98

అప్పు చేయువాఁడు ముప్పును బొందును
తనకు వచ్చుదాని దాటెనేని
వ్రణముబాధ యెంతొ ఋణముబాధయు నంతె
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 99

# అర్థాలు

ఆర్యజనవిధేయ = పెద్దలయందు గౌరవముగల

ఆంధ్రతనయు = ఆంధ్రదేశమందు పుట్టినబిడ్డ

మహిని = భూమియందు

వెలసియున్న = అవతరించియున్న

కరుణన్ = దయతో

మాతృసేవ = నీవు పుట్టినదేశమగు భరతమాత సేవ

మున్నుగాగల = మొదలగునవి

పూజ్యభూమి = పూజింపదగినట్టి భూమి

కామితార్థము = నీవుకోరు కోరికలు

కల్పవృక్షంబు = నీకు అభీష్టములుతీర్చు చెట్టు

ఘనులు = గొప్పవారు

భవ్యదేశమ్ము = పూజింపదగిన దేశము (పుణ్యభూమి)

దాస్యము = ఇతరప్రభుత్వమునకు లొంగియుండుట

శాంతిసమరము = సహాయనిరాకరణము

సమసినట్టి = చనిపోయినట్టి

జోదులు = వీరులు

జోహారు = నమస్కారము

గుండెలందు = మనస్సులందు

అగ్గినిరగిలించి = కష్టముకలిగించి

ఆంగ్లేయులు = ఇంగ్లీషువారు

పామువిష మటన్న భయ మందరికి నుర్వి
విషములోన మంచి విషయ ముండు
విషము మందుగాగ వెజ్జు లొసంగరా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 105

అందమంచిదైనఁ గొండల గమియించు
చీమయైన బాధ చెందకుండ
దైవబలము కలుగ ధర నసాధ్యము ధరలేదు
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 106

దాతలన్న పే రదాటున వచ్చునా
పేరుకొఱకుచేయు పెద్దలకును
దాతలన్న శిబియు, దాను కర్ణుండురా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 107

ఉన్నదానితోనె మిన్నకయుండిన
శాంతికేమి కొఱత సంభవించు
ఆశతోనె నరుడు నాశంబునందురా
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 10(

జై హిం ద్

పాఠమెఱుకపడక = పాఠము తెలియక

బద్ధకస్థుఁడు = సోమరి

తుది = చివర

మొదలంట = పూర్తిగా

సద్బుద్ధి = మంచిబుద్ధి

కుదురుగాన్ = చక్కగా (గట్టిగ)

కూర్మిప్రార్థన సేసి = ప్రేమతో (శ్రద్ధతో) దేవునిధ్యానించి

కాలకృత్యములు = ప్రతిదినము నిద్దురలేవగనే చేయుపనులు

సన్మార్గము = మంచిదారి

అబ్బున్ = కలుగును

అధమాధముడు = నీచులలోకెల్ల నీచుఁడు

సుగుణజాలము = మంచిగుణములు

ఈర్ష్య = అసూయ

స్వీయగాథలు = జీవితచరిత్రలు

ఏలిక = రాజు (ప్రభుత్వము)

పరిశుద్ధుడు = నిర్మలమైన మనస్సుగలవాఁడు

వాక్కు = మాట

వేదవాక్కు = మంచిమాటలు

భాగ్యాలు = సుఖములు

గృహిణి = భార్య

చేకూరు = కలుగును

అమరుట = కలుగుట

అణఁగు = నాశమగును, తగ్గుట, నాశనము

ఢాక = జయభేరి

కీర్తి = పేరు

పడసె = పొందెను

ఆంధ్రకేసరి = ఆంధ్రసింహము

ఆర్జించుట = సంపాదించుట

నెగ్గుదేలినాఁడు = గొప్పవాడనిపించుకొనినాఁడు

రచ్చకెక్కించెను = ప్రపంచమునకు వెల్లడిచేసెను

మార్గదర్శి = తెలిసికొని ఆచరింపదగుమనిషి

పూజ్యతముఁడు = పూజింపదగినవాఁడు

విస్మరింపకు = మరువకు

ధరన్ = భూమియందు

ధరణి = భూమి

ద్రవియించి = కరిగించి

ఆర్జించెరా = పొందెరా

గడియించి = పొంది

పతాకము = జండా

మహిని = భూమియందు

జేజేలుపలుకరా = జేకొట్టుము

అయ్యవారు = ఉపాధ్యాయుఁడు

అధికుండు = గొప్పవాఁడు

ఉర్విన్ = భూమియందు

వ్యర్థభాషణము = పనికిమాలినమాటలు

యశము = పేరు ప్రతిష్ఠలు

అద్వితీయము = గొప్పది

హృదయాల = మనస్సులందు

ఆశ్చర్యమ్ము = ఆశ్చర్యము

కూర్చు = కలుగజేయు

నిధిని = గొప్పధనము (ప్రకాశము)

పంచమవేదంబు = ఐదవవేదము

భాగవతము = భగవంతుని చరిత్రగలది

రామాయణము = శ్రీరామచంద్రుని చరిత్రగలది

భావబంధురము = చక్కని భావములతో

విజ్ఞానవిభవమ్ము = గొప్పజ్ఞానము

పస్తునాడు = తిండిలేనివాడు

సహావమ్ము = ఓర్పు

తమము = చీకటి

దర్శనము = కనుపించుట

వెలితి = కొఱత

చంచలము = స్థిరమైనది కాదు

కమ్మగామాటాడి = నమ్మించుమాటలు మాట్లాడి

తథ్యము = నిజము



ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి

శ్రీ రాఘవేంద్రాయ నమః

# ఆంధ్రతనయ

*

మహిని జనులు పొగడ మంత్రాలయమ్ములో
వెలసియున్న రాఘవేంద్ర గురుఁడు
కరుణఁ జూచి మనలఁ గాపాడుఁగావుత
ఆర్యజనవిధేయ ! ఆంధ్రతనయ ! 1

భరతదేశమన్న బంగారుభూమిరా
భరతమాత మనకుఁ బట్టుకొమ్మ
మాతృసేవలోన మన సుంచవలె సుమ్ము
ఆర్యజన విధేయ ! ఆంధ్రతనయ ! 2

పెన్న, తుంగభద్ర మున్నుగాఁగల మహా
పుణ్యనదులు పారు పూజ్యభూమి
కామితార్థ మొసఁగు కల్పవృక్షంబురా
ఆర్యజనవిధేయ ! ఆంధ్రతనయ ! 3

సప్తఋషులు ఘనులు సజ్జనబృందంబు
పుట్టినట్టి పుణ్యభూమి మనది
భరతదేశమన్న భవ్యదేశమ్మురా,
ఆర్యజనవిధేయ ! ఆంధ్రతనయ ! 4

# పండితాభిప్రాయములు

ఏకార్థవిషయకము, నేకకర్తృకము నగు పద్యసముదాయము సంఘాత కావ్య మనఁబడును. శతకము లీ తెగకావ్యములకుఁ జెందినవి. మన దేశమునఁ జిరకాలమునుండియు శతకములకు ప్రచారము మెండు.

ఇవి మనసును రంజించు మధుర భావములతోను, ముద్దులొలుకు పద్దెములతోను నీతిబోధకములై బాలురకుఁ గావ్య ప్రయోజనమును గరతలామలక మొనర్చుటయే దీనికి హేతువు. ప్రస్తుతము మిత్రులగు సరళకవి శ్రీ గుఱ్ఱప్పడియ సత్యనారాయణమూర్తి పై ఆదర్శము ననంతరంగమున నిడుకొని తమ ఆంధ్రతన యాభిమానమును వెల్లడించుచు స్వానుభవములను, లోకానుభవములను జతపరచి " ఆర్యాజనవిధేయ! ఆంధ్రతనయ! " అను మకుటముతో నీతిబోధకమగు, నీతిగీతికలు, రచించి కృతకృత్యులై నందుకు నేనెంతయు సంతసించుచున్నాను. వీరి భావములును, భావానుకూల మగు భాషయు, ఉపదేశక్రమమును వీరికిఁగల చిరంతనోపాధ్యాయానుభవమును, చెప్పక చెప్పుచున్నది. ఈ నీతిగీతికలవలని లాభములను బాలుర చిరకాలములోనే పొందుదురుగాక యని యాశించుచున్నాను.

ఇట్లు

కవిశేఖర:- పళ్లె పూర్ణప్రజ్ఞాచార్యులు

పండితులు;- హిందుకాలేజి,

గుంటూరు
14—5—56

★

" ఆంధ్రతనయ " అను గీతికలు నేను ఆమూలాగ్రముగఁ జదివితిని. ఈ నీతిపద్యములు మిగుల సరళమైన భాషలో మృదుమధురశైలిలో నున్నవి. ఇందలి నీతులు తక్కిన శతకములకన్న నొక విశిష్టత గలిగియున్న వనుటలో నతిశయోక్తి లేదు, ఈ " నీతిగీతికలు " 3 వ తరగతినుండి 6 వ తరగతి విద్యార్థుల కెంతయు నుపయోగపడునని నా విశ్వాసము.

ఇందలి పద్యము లన్నియు బాలుర కంఠస్థముచేయఁదగు శైలిలో నున్నవి. కావున, ఈ చిన్నిపొత్తము పాఠశాలలోఁ బఠనీయగ్రంథముగా నేర్పఱచి ఈ " సరళకవి గు సత్యనారాయణమూర్తిగారి భాషాసేవను ప్రోత్సహింతురుగాక.

ఇట్లు

ఉభయభాషాప్రవీణ

చామర్తి సన్నయ్యశాస్త్రి

సీనియర్ తెలుగుపండిట్, స్టాల్ గరల్స్ హైస్కూల్.

గుంటూరు,
12—5—56